# అథ నవమో%ధ్యాయః

# శివుని యాత్ర

సనత్కుమార ఉవాచ |

ఈదృగ్విధం మహాదివ్యం నానాశ్చర్యమయం రథమ్ | సంనహ్య నిగమానశ్వాంస్తం బ్రహ్మ ప్రార్పయ చ్ఛివమ్ || 1

శంభ##వే%సౌ నివేద్యాధిరోపయామాస శూలినమ్ | బహుశః ప్రార్థ్యదేవేశం విష్ణ్వాది సురసంమతమ్ || 2

తతస్తస్మిన్ రథే దివ్యే రథప్రాకారసంయుతే | సర్వేదేవమయ శ్శంభురారురోహ మహాప్రభుః || 3

ఋషిభిస్తూ్స యమానశ్చ దేవంగధపన్నగైః | విష్ణునా బ్రహ్మణా చాపి లోకపాలై ర్బభూవ హ || 4

ఉపావృతశ్చాప్సరసాం గణైర్గీత విశారదైః || శుశుభే వరదశ్శంభుస్స తం ప్రేక్ష్య చ సారథిమ్ || 5

తస్మిన్నారోహతి రథం కల్పితం లోకసంభృతమ్ | శిరోభిః పతితా భూమౌ తురంగా వేదసంబవాః || 6

సనత్కుమారుడిట్లు పలికెను -

ఇటువంటి మమాదివ్యమైన, అనేకములగు ఆశ్చర్యములతో కూడియున్న రథమయునకు వేదములనే గుర్రములను పూన్చి బ్రహ్మ శివునకు అర్పించెను (1). దేవదేవుడు, విష్ణువు మొదలగు దేవతలచే కొలువబడువాడు, శూలధారి యగు శంభుని పరిపరివిధముల స్తుతించి బ్రహ్మ ఆయనను రథమును అధిష్టింపజేసెను (20). సర్వదేవతా స్వరూపుడు, మహాప్రభుడునగు శంభుడు అపుడు రథసామగ్రితో కూడిన ఆ దివ్య రథమును అధిష్టించెను (3). అపుడాయనను ఋషులు, దేవతలు, గంధర్వులు, నాగులు, విష్ణువు, బ్రహ్మ మరియు లోకపాలకులు స్తుతించిరి (4). సంగీతకుశలురగు అప్సరసల గణములు చుట్టు

వారి యుండగా, సారథియగు బ్రహ్మను గాంచినవాడై, వరములనిచ్చు ఆ శంభుడు విరాజిల్లెను (5). లోకములోని వస్తువులచే రచింపబడిన ఆ రతమును శివుడు అధిరోహించగానే, వేదముల నుండి పుట్టిన గుర్రములు శిరస్సులై గూలినవి (6).

చచాల వసుధా చేలుస్సకలాశ్చ మహీధరాః | చకంపే సహసా శేషో%సోఢా తద్భారమాతుః || 7

అథాదస్స రథస్యాస్య బగవాన్ ధరణీధరః | వృషేంద్రరూపీ చోత్తాయ స్థాపయామాస వై క్షణమ్ || 8

క్షణాంతరే వృషేంద్రో%పి జానుభ్యామగమద్ధరామ్ | రథారూఢ మహేశస్య సుతేజసోఽఢుమక్షమః || 9

అభీషు హస్తో భగవానుద్యమ్య చ హయాంస్తదా | స్థాపయామాస దేవస్య వచనాద్వై రథం వరమ్ || 10

తతో%సౌ నోదయామాస మనో మారుతరంహసః | బ్రహ్మ హాయాన్ వేదమయాన్నద్ధాన్ రథవరే స్థితః || 11

పురాణ్యుద్ధిశ్య వై త్రీణి తేషాం ఖస్థాని తాని హి | అధిష్ఠితే మహేశే తు దానవానాం తరస్వినామ్ || 12

అథాహ భగవాన్రుద్రో దేవానాలోక్య శంకరః | పశూనా మాధిపత్యం మే ధధ్వం హన్మి తతో%సురాన్ || 13

భూమి కంపించెను. పర్వతములన్నియు చలించినవి. శివుని భారమును సహించలేక శేషుడు శీఘ్రమే భయ విహ్వాలుడై కదలాడి పోయెను (7). అపుడు భూమిని మ్రోయు శేష భగవానుడు గొప్ప ఎద్దురూపముతో ఆ రథము క్రిందకు జేరి క్షణములో దానిని పైకి ఎత్తి నిలబెట్టెను (8). కాని రథము నదిష్ఠించియున్న మహేశ్వరుని గొప్ప తేజస్సును సహింప జాలక ఆయన కూడ మరుక్షణమలో మోకాళ్లపై నేలగూలెను (9). అపుడు భగవాన్ బ్రహ్మ చేతి యందు కొరడాను బట్టి గుర్రముల నదలించి శివుని మాటచే ఆ శ్రేష్ఠరథమును నిలబెట్టెను (10). అపుడు బ్రహ్మ శ్రేష్ఠమగు ఆ

రథమునందు కూర్చున్నవాడై మనో వేగ వాయు వేగములు గల, వేదరూపములైన, ఆ రథమునకు పూర్చబడి యున్న గుర్రములను తోలెను (11). మహావీరులగు ఆ రాక్షసుల యొక్క, ఆకసము నందుండే మూడు నగరములను లక్ష్యముగా చుసుకొని బ్రహ్మ మహేశ్వరునిచే అధిష్ఠింపబడిన ఆ రథమును నడుపును (12). అపుడు మంగళకరుడగు రుద్ర భగవానుడు దేవతల వైపు చూచి 'నాకు పశుపతిత్వమును కల్పించినచో, నేను రాక్షసులను సంహరించెదను' అని పలికెను (13).

పృథక్ మవుత్వం దేవానాం తథాన్యేషాం సురోత్తమాః |
కల్పయిత్త్వైవ వధ్యాస్తే నాన్యథా దైత్యసత్తమాః || 14

ఓ దేవశ్రేష్ఠులారా ! దేవతలకు మరియు ఇతర జీవులకు వేర్వేరుగా పశుత్వమును కల్పించినచో, ఆ రాక్షసులు సంహరింపబడెదరు. అట్లు గానిచో, ఆ రాక్షసవీరుల సంహరింపబడరు (14).

సనత్కుమార ఉవాచ |

ఇతి శ్రుత్వా వచస్తస్య దేవదేవస్య ధీమతః | విషాదమగమన్ సర్వే పశుత్వం ప్రతి శంకితాః || 15

తేషాం భావమథ జ్ఞాత్వా దేవదేవో%ంబికాపతిః | విహస్య కృపయా దేవాన్ వంభుస్తాని దమబ్రవీత్ || 16

సనత్కుమారుడిట్లు పలికెను -

ధీమంతుడు, దేవదేవుడునగు శివుని ఆ మాటను విని అందరు పశుభావమును గూర్చి శంక గలవారై దుఃఖమును పొందిరి (15). దేవదేవుడు, పార్వతీపతి యగు శంభుడు ఆ దేవతల మనోగతము నెరింగి నవ్వి వారిని ఉద్దేశించి దయతో నిట్లనెను (16).

శంభు ఉవాచ |

మా వో%స్తు పశుభావే%పి పాతో విబుధసత్తమాః | శ్రూయాతాం పశుభావస్కయ విమోక్షః క్రియతాం చ సః || 17

మో వై పాశు పతం దివ్యం చయరిష్యతి స మోక్ష్యతి | పశుత్వాదితి సత్యం వః ప్రతిజ్ఞాతం సమాహితాః || 18

యే చాప్యన్యే కరిష్యంతి వ్రతం పాశుపతం మమ | మోక్ష్యంతి తే న సందేహః పశుత్వా త్సురసత్తమాః || 19

నైష్ఠికం ద్వాదశాబ్దం వా తదర్ధం వర్షకత్రయమ్ | శుశ్రూషాం కారయేద్యస్తు స పశుత్వాద్విముచ్యతే || 20

తస్మత్పరమిదం దివ్యం చరష్యథ సురోత్తమాః | పశుత్వాన్మోక్ష్యథ తదా యూయమత్ర న సంశయః || 21

శంభుడు ఇట్లు పలికెను -

ఓ దేవశ్రేష్ఠులారా ! మీరు పశుభావమును పొందిననూ పతనమును పొందరు. పశుభావము నుండి విముక్తిని పొందే ఉపాయమును గురించి విని, ఆ విధముగా ఆచరించుడు (17). ఎవడైతే దివ్యమగు పాశుపత వ్రతమునాచరించునో, ఆతడు పశుత్వము నుండి విముక్తిని పొదగలడు. ఇది సత్యము. నేను ప్రతిజ్ఞను చుయుచున్నాను. గమనించుడు (18). ఓ దేవశ్రేష్ఠులారా ! మీరే గాక ఇతరులైననూ నా ఈ పాశుపతవ్రతము నాచరించినచో పశుత్వము నుండి విముక్తులగుదురనుటలో సందియము లేదు (19). ఎవడైతే జీవితకాలమంతయూ, లేదా పన్నెండు సంవత్సరములు, లేక ఆరు సంవత్సరములు, లేక మూడు సంవత్సరములు శుశ్రూషను చేయునో, వానికి పశుత్వము నుండి ముక్తి కలుగును (20). ఓ దేవ శ్రేష్ఠులారా ! కావున ఈ శ్రేష్ఠమగు దివ్యవ్రతము నాచరింపుడు. మీకు నిస్సంశయముగా పశుత్వమునుండి విముక్తి కలుగును (21).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తస్య మహేశస్య పరాత్మనః | తథేతి చాబ్రువన్ దేవా హరిబ్రహ్మాదయస్తథా || 22

తస్మాద్దై పశవస్సర్వే దేవాసురవరాః ప్రభోః | రుద్రః పశుపతిశ్చైవ పశుపాశవిమోచకః || 23

తదా పశుపతీత్యేతత్తస్య నామ మహేశితుః | ప్రసిద్ధమభవద్వ్యాధ్వా సర్వలోకేషు శర్మదమ్ || 24

ముదా జయేతి భాషంతస్సర్వే దేవర్షయస్తదా | అముదంశ్చాతి దేవేశో బ్రహ్మ విష్ణుః పరేపి చ || 25

తస్మింశ్చ సమయే యచ్చ రూపం త్య మహాత్మనః | జాతం తద్వర్ణితుం శక్యం న హి వర్ష శ##త్రైరపి || 26

ఏవం విధో మహేశానో మహేశాన్నఖిలేశ్వరః |మ జగామ త్రిపురం హంతుం సర్వేషాం సుఖదాయకః || 27

తం దేవ దేవం త్రిపురం నిహంతు తదా ను సర్వే తు రవిప్రకాశః |

గజైర్హయైస్సింహవరై రథైశ్చ వృషైర్యయుస్తే%మరరాజ ముఖ్యాః || 28

సనత్కుమారుడిట్లు పలికెను-

పరమాత్మయగు ఆ మహేశ్వరుని ఈ మాటను విని, విష్ణు బ్రహ్మాది దేవతలు 'సరే' అని తమ అంగాకారమును తెలిపిరి (22). అందువలననే, దేవతలు, దేవశ్రేష్ఠులు, రాక్షసవీరులు అందరు ఆ ప్రభునకు పశువులు అయిరి. పశువుల పాశములను విడిపించు రుద్రుడు పశుపతి ఆయెను (23). అప్పటి నుండియు మహేశ్యరునకు పశుపతి యను మంగళకరమగు నామము లోకములన్నింటి యందు ప్రసిద్ధిని గాంచెను (24). అపుడు బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, దేవతలు, ఋషులు మరియు ఇతరలు అందరు ఆనందముతో జయధ్వానములను చేయుచూ మిక్కిలి ఆనందించిరి (25). ఆ సమయములో మహాత్ముడగు శివునకు గల రూపమును వందల సంవత్సరములు కాలములోనైననూ వర్ణించుటకు శక్యము గాదు (26). మహేశ్వరుడు, సర్వలోకములకు ప్రభువు, సర్వులకు సుఖము నిచ్చువాడు అగు పార్వతీపతి ఈ

విధముగా త్రిపుర సంహారమునకై బయల్వెడలెను (27). ఇంద్రుడు మొదలైన, సూర్యునితో సమమగు తేజస్సు గల దేవవీరులు త్రిపురవధ కొరకై ఏనుగులపై, గుర్రములపై, గొప్ప సింహములపై, రథములపై, మరియు వృషభములపై అధిష్ఠించి ఆ దేవదేవుని అనుసరించి వెళ్లిరి (28).

హలైశ్చ శాలైర్ముశ##లై ర్భుశుండైః గిరీంద్ర కల్పైర్గిరి సన్నిభాశ్చ |

నానాముధై స్సంయుత బాహవస్తే తతోను హృష్టాః ప్రయయుస్సురేశాః | 29

నానాయుధాఢ్యాః పరమప్రకాశా మహోత్సవాశ్శంభుయం వదంతః |

మయుః పురస్తస్య మహేశ్వరస్య తదేంద్ర పద్మోద్భవ విష్ణు ముఖ్యాః || 30

జహృషుర్మునయస్సర్వే దండహస్తా జటాధరాః | వవృషుః పుష్పవర్షాణి ఖేచరాస్సిద్ధ చారణాః || 31

పురత్రయం చ విప్రేంద్రా వ్రజన్ సర్వే గణ శ్వరాః | తేషాం సంఖ్యాం చ కః కర్తు సమర్థో వచ్మి కాంశ్చన || 32

గణ శ్వరైర్దేవ గణైశ్చ భృంగీ సమావృత స్సర్వగణ ంద్ర వర్యః |

జగామ యోగింస్త్రిపురం నిహంతుం విమానమారుహ్య యథా మహేంద్రః || 33

ఆ దేవశ్రేష్ఠులు నాగళ్లతో, వృక్షములతో, రోకళ్లతో, భుశుండమనే ఆయుధములతో కూడిన బాహువులు గలవరై శివుని అనుసరించి పయనమైరి. పర్వతాకారులగు వారి చేతులలో పర్వతముల వంటి ఆయుధములు ఉండెను (29). అపుడు ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలు అనేకములగు ఆయుధములచే ఒప్పుచున్నవారై, గొప్ప ప్రకాశము గల వారై, మహోత్సవముతో శంభునకు జయధ్వానములు పలుకుతూ ఆ మహేశ్వరుని యెదుట నడిచిరి (30). చేతులలో దండములను ధరించిన జటాధారులగు

మునులందరు ఆనందించిరి. ఆకాశమునందు సంచరించే సిద్ధులు, చారణులు పూలవానను కురిపించిరి (31). ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! గణాధ్యక్షులందరు త్రిపురములకు పయనమైరి. వారి సంఖ్యను గణించగల సమర్థుడు ఎవడు గలడు? అయిననూ కొన్ని వివరములను చెప్పెదను (32). ఓ యోగి! గణాధ్యక్షులతో, మరియు దేవగలణములతో చుట్టువారబడి యున్నవాడు, గణాధ్యక్షులందరిలో ప్రముఖుడు అగు భృంగి విమానము నధిష్ఠించి మహేంద్రుని వలె త్రిపురాసుర సమహారము కొరకు బయలు దేరి వెళ్లెను (33).

కేశో విగతవాసశ్చ మహాకేశో మహాజ్వరః | సోమవల్లీ సవర్ణశ్చ సోమదస్సనకస్తథా || 34

సోమధృక్ సూర్యవర్చాశ్చ సూర్యప్రేషణకస్తథా | సూర్యాక్ష స్సూరినామా చ సురస్సుందర ఏవ చ || 35

ప్రస్కందః కుదరశ్చండః కపనశ్చాతికంపనః | ఇంద్రశ్చేంద్రజవశ్చైవ యంతా హిమకరస్తథా || 36

శతాక్షశ్చైవ పంచాక్షస్సహస్రాక్షో మహోదరః | సతీజహుశ్శతాస్యశ్చ రంకః కర్పూర పూతనాః || 37

ద్విశిఖస్త్రి శిఖశ్చైవ తథాహంకారకారకః | అజవక్త్రో%ష్ట వక్త్రశ్చ హయవక్త్రో%ర్ధవక్త్రకః || 38

ఇత్యాద్యా తణాపా వీరా బహవో%పరిమేయకాః | ప్రయయుః పరివర్యేశం లక్ష్యలక్షణవర్జితాః || 39

కేశుడు, విగతవాసుడు, మహాకేశుడు, మహాజ్వరుడు, సోమవల్లీ సవర్ణుడు, సోమదుడు, సనకుడు (34). సోమధృక్, సూర్యవర్చసుడు, సూర్యప్రేషణకుడు, సూర్యాక్షుడు, సూరినాముడు, సురుడు, సుందరుడు (35). ప్రస్కందుడు, కుందరుడు, చండుడు, కంపనుడు, అతికంపనుడు, ఇంద్రుడు, ఇంద్రజవుడు, యంత, హిమకరుడు (36). శతాక్షుడు, పంచాక్షుడు, సహస్రాక్షుడు, మహోదరుడు, సతీజహుడు,

శతాస్యుడు, రంకుడు, కర్పూరపూతనుడు (37). ద్విశిఖుడు, త్రిశిఖుడు, అహంకార కారకుడు, అజవక్త్రుడు, అష్టవక్త్రుడు, హయవక్త్రుడు, అర్ధవక్త్రుడు (38). మొదలైన అపరిమిత బలశాలురైన, వారులగు గణాధ్యక్షులు అనేకులు అక్ష్యమును గురించి గాని, లక్షనముల గురించి గాని చింత చేయని వారై శివుని చుట్టుముట్టి ముందునకు సాగిరి (39).

సమావృత్య మహాదేవం తదాపుస్తే పినాకినమ్ | దగ్ధు సమర్థా మనసా క్షణ న సచరాచరమ్ || 40

దగ్ధుం జగత్సర్వమిదం సమర్థాః కిం త్వత్ర తగ్ధుం త్రిపురం పినాకీ |

రథేన కిం చాత్ర శ##రేణ తస్య గణైశ్చ కిం దేవగణైశ్చ శంభోః || 41

స ఏవ దగ్ధుం త్రిపురాణి తాని దేవద్విషాం వ్యాస పినాకపాణిః |

స్వయం గతస్తత్ర గణైశ్చ సార్ధం నిజైస్సురాణామపి సో%ద్భుతోతిః || 42

కిం తత్ర కారణం చాన్యద్వచ్మి తే ఋషి సత్తమ | లోకేషు ఖ్యాపనార్థంవై యశః పరమలాపహమ్ || 43

అన్యచ్చ కారణం హ్యేతద్దుష్టానాం ప్రత్యయాయ వై |సర్మేష్వపి చ దేవేషు యస్మా న్నాన్యో విశిష్యతే || 44

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధ ఖండే శివయాత్రా వర్ణం నామ

నవమో%ధ్యాయః (9).

వారు అపుడు పినాకధారియగు మహాదేవుని చుట్టు వారి యుండిరి. వారు సంకల్పమాత్రముచే చరాచర జగత్తును భస్మము చేయుటకు సమర్థులు (40). ఈ జగత్తు నంతనూ దహించుటకు వారే సమర్థులై యుండగా, త్రిపురనాశము కొరకు పినాకధారియగు శివుడు స్వయముగా వచ్చుటకు కారణమేమి? ఆ శివునకు రథముతో గాని,

బాణముతో గాని, రుద్ర గణములతో గాని, దేవగణములతో గాని ప్రయోజనమేమి గలదు? (41). ఓ వ్యాసా! ఆ రాక్షసుల త్రిపురములను దహించుటకు ఆయన ఒక్కడే సమర్థుడు. అయినను ఆ పినాకపాణి స్వీయగణములతో, మరియు దేవగణములతో గూడి స్వయముగా బయలుదేరినాడు. ఇది అత్యాశ్చర్యము (42). ఓ మహర్షీ! ఆయన అట్లు చేయుటకు గల కారణమునుచెప్పెదను. ఆయన పరమపవిత్రమగు కీర్తిని లోకములో విస్తరింపజేయుట కొరకై అట్లు చూసెను (43). ఇట్లు చేయుటకు మరియొక కారణము గలదు. దేవతలందరిలో సర్వోత్తముడు శివుడే గాని మరియొకడు గాడు అను నమ్మకము దుష్టులకు కలిగించుట కొరకై భగవానుడట్లు చేసెను (44).

శ్రీ శివ మహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధ ఖండలో శివయాత్రా వర్ణనమనే తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).